# శ్రీకృష్ణ లీలావినోదిని

(శ్రీ మల్లహరికృష్ణ శతకవ్యాఖ్య)




రచన

**శ్రీ బి.టి. ఆనందరామాచార్యులు**

రిటైర్డు హెడ్ పర్చేజ్ & స్టోర్సు

భారతీయ అంతరిక్ష అనుసంధానసంస్థ షార్ కేంద్రము

శ్రీహరికోట, నెల్లూరుజిల్లా (ఆం.ప్ర)

ప్రచురణ

**త్రికరణ్మయి ఆర్ట్స్ & కల్చరల్ అసోసియేషన్,**

టి ఆర్ టి 141 విద్యానగర్ కాలనీ న్యూనల్లకుంట

హైదరాబాద్ - 500 044 ఫోన్ :- 7601212

టి. ఆర్. టి. 141, విద్యానగర్ కాలనీ,

న్యూనల్లకుంట,

హైదరాబాద్ - 500 044

ఫోన్ : 7601212



ప్రథమ ముద్రణ

1000, కాపీలు

27-4-2001



గ్రాఫిక్స్ & ముద్రణ

**కళాచిత్ర ప్రింటర్స్,** సూళ్ళూరుపేట

వెల రు. 10/-

## కృతికర్త :



బి.టి. ఆనందరామాచార్యులు

ధర్మపత్ని : శ్రీమతి బి.టి. వెంకటలక్ష్మి

# ముందుమాట

# త్రికరణ్మయి మృదుపలుకు

శ్లో॥ రామానుజ దయాపాత్రం - జ్ఞానవైరాగ్య భూషణం
శ్రీమద్వేంకటనాథార్యం - వందేవేదాంతదేశికం ॥

కం. తొలుతను తల్లిదండ్రులను
మలుతను రంగశఠగోప గురువర్యులనున్
బలుతర సుందరవల్లిని
కొలుతును సత్యజాంబవతి మల్లహరినెపుడున్

ముందుగా నాతల్లితండ్రులైన కీ.శే.శ్రీమతి రాజ్యలక్ష్మి, శ్రీమాన్ బుక్కపట్నం తిరుమల లక్ష్మీ, నరసింహాచార్యుల గారి దివ్యచరణములకు ప్రణతులిడుతూ యీ శతక కృతికర్తగా, మరియూ త్రికరణ్మయి సంస్థ స్థాపకుడిగా ముందుమాటగా, ముఖ్యంగా మణిమండపక్షేత్రంగా విరాజిల్లేడి శ్రీ అళఘుమల్లారికృష్ణస్వామి వారి దేవస్థానం విషయమై భక్తులందరికి తెలియటం కోసం వ్రాయతలబెట్టితిని

1-8-2000 నాటికి భారత అంతరిక్ష అనుసంధాన సంస్థ, షార్‌కేంద్రం, శ్రీహరికోట నుండి హెడ్ పర్చేజ్ & స్టోర్సుగా విరమణుడనయిన నాకు, 1976 నాటినుండే సూళ్ళూరుపేటకు అతి సమీపంలో కాళంగీ నదీతీరాన గల మన్నారుపోలూరు గ్రామంలో వేంచేసియున్న శ్రీ అళఘుమల్ల హరికృష్ణ స్వామి వారి ఆలయ జీర్ణోద్ధరణ కార్యక్రమంలో వరుసగా రెండుసార్లుపాలుపంచుకొనే అవకాశం దొరికింది. రిటైరయ్యే దాక కాయితంమీద కలంపెట్టి ఒక్క పద్యంగూడా వ్రాయనెరుగని నాకు శ్రీకృష్ణ స్వామివారి నుంచి నువ్వెందుకు నాపై శతకమొక్కటి వ్రాయ ప్రయత్నించవు అని సంకేతాలు నిదురలో రావడం మొదలయినాయి. ముందు నేను తేలికగా నేనేం వ్రాస్తానని తీసిపారేసినా, ఒకవారం రోజుల తరువాత నాలో బలమైన వుత్సాహ, ఉద్రేకం ప్రారంభమై

శ్రీమల్లహరికృష్ణ శతకం వ్రాయ యధాలాపంగా మొదలుపెడితిని. మొదలు కేవలం క్షేత్ర సంబంధముగా ముఖ్యమైన శమంతకమణోపాఖ్యానం వ్రాయాలని సంకల్పించినా, మెల్లమెల్లగా దశావతార వర్ణనం, శ్రీకృష్ణ జనన వృత్తాంతం, శ్రీకృష్ణ బాల్యక్రీడలు, కంసవధ, శ్రీరుక్మిణీ కళ్యాణం, యీ విధంగా శ్రీకృష్ణలీలా వినోదినిగా 117 పద్యాలు కేవలం మూడు నెలలలో వ్రాయడం సంభవించింది. తింటువున్నా, పడుకొనివున్నా, ఎక్కడి కన్నా ప్రయాణం చేస్తున్నాయిదే వ్యాపకం. ఏదైతే నేం, తప్పో పొప్పో నాకు తెలియదుగాని యీ 116 పద్యాలు శ్రీ కృష్ణ స్వామే వ్రాయించాడు కనుక వారికే యికృతి అంకితం.

నా పూర్వీకులు అనంతపురం జిల్లా లోని బుక్కపట్నం వాస్తవ్యులు శఠ మర్షణ గోత్రికులు, పండిత కవులు గా ప్రసిద్ధి గాంచిన వారు కాలక్రమేపి వీరిలో ఒక కుటుంబం ముందుగా తిరుపతి, శ్రీకాళహస్తి తదుపరి న్యూజివీడు సంస్థానంకు వలస వెళ్ళి సారస్వత సేవ చేసుకొని, అష్టావధానాలు జరిపి ఉయ్యూరుకు సమీపంలోని ఉరుటూరు అగ్రహారీకులైరి.

ఈ మధ్యనే 1996లో మా మాతా ప్రపితామహులు శ్రీమాన్ బుక్కపట్నం రాఘవాచార్యులు గారు రచించి ముద్రణనకు నోచుకోని 100 సంవత్సరములనాటి శ్రీ కువలాశ్వవిజయము (హూణభాషాంధ్ర దివ్య కథా ప్రబంధమును) నామేనమామ గారైన శ్రీమాన్ మాడభూషి శ్రీనివాసాచార్యులు గారి (రిటైర్డు కోపరేటివ్ సబ్ రిజిష్ట్రార్ పొన్నూరు) ప్రోత్సాహంతో మాత్రికరణ్మయి సారస్వత విభాగము వారు టి.టి.డి. వారి ధన సహాయముతో ముద్రించి, ఆవిష్కరణజేయడం జరిగింది. ఈ గ్రంథమే కాక నాకు గురుతుల్యులు శ్రీ తెలికిచెర్ల రాజేశ్వర శర్మ గారు (వేదశాస్త్రపండితులు, శ్రీకాకుళం) వారి అనేక గ్రంథాలయిన శ్రీ రుద్రాభిషేకమాహాత్మ్యము, శ్రీ సూర్యనమస్కార ప్రభావము (మహాసౌరమంత్ర రహస్యములు) మొదలగు గ్రంథములు ముద్రితమై వెలుగు లోనికి రావటానికి టి.టి.డి వారి ద్రవ్య సహాయం తోడ్పడింది యీ పెద్దల ఆశీస్సులతో నేమో నేను శ్రీకృష్ణలీలావినోదిని శ్రీమల్లహరికృష్ణశతకం వ్రాయగలిగాననిపిస్తున్నది.

ఇక యీ క్షేత్ర విషయానికి వస్తే, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమున గల అతి చారిత్రాత్మక పురాణ ప్రసిద్ధి చెందిన శ్రీ వైష్ణవ పుణ్యక్షేత్రాలలో, నెల్లూరు జిల్లా,

సూళ్లూరుపేట మండలమునకు కేవలం 4 కిలో మీటర్ల దూరంలో కాళంగీ నదీ తీరాన మణి మండపక్షేత్రముగా వెలసియున్న శ్రీ అళఘు మల్లారికృష్ణ స్వామి వారి దేవాలయమువొకటి. సకల కళా శోభితుడై సర్వాంగ సుందరుడై చిరునవ్వులొలుకుచూపిల్లన గ్రోవి చేతబూని యిరుప్రక్కల శ్రీ సత్య భామాశ్రీ జాంబవతీ సమేతుడై భక్తులకు కొంగు బంగారమై నిలచియున్న స్వామిని దర్శించిన జన్మతరించు ననుటంలో సందేహంలేదు. తమిళ భాషలో అళఘు అనగా అందమైన సుందరమైన, మల్లారి (మల్లహరి) అనగా మల్లయుద్ధం జరిపిన హరి శ్రీకృష్ణ స్వామి. కాలాంతరమున యీ క్షేత్రమును మల్లారి పోలూరు - మన్నారు పోలూరుగా పిలవడం వాడుకలోనికి వచ్చినది.

10 వ శతాబ్దానికి ముందుగనే చోళరాజులచేయీ దేవాలయ సమూహము నిర్మింపబడి, 13 వ శతాబ్దమున సింహపురి(ప్రస్తుత నెల్లూరు) రాజ్యమునేలిన మనుమ సిద్ది భూపాలుని కాలమున అర్థమండప మహా మండప, ప్రాకార, అలంకార, వుట్ల, పారివేటి మండపముల వంటివి దేవాలయ నలు దిశల నిర్మాణము గావింపబడి యీ మల్లహరి కృష్ణ క్షేత్రం మణి మండపక్షేత్రముగా అత్యంతవైభవోపేతముగా నలరారు చుండినట్లు 17, 18 వ శతాబ్దపు పైడిపాటి వెంకటునరసింహ కవి రచించిన, కోదండరామ శతకము అటులనే అయ్యల రాజు నారాయణ కవి రచించిన హంస వింశతి యందు నుడువుట జరిగినది, 18 వ శతాబ్దమున వెంకటగిరి సంస్థానంక్రింద అనేక వుత్సవములతో, దేవదాసీ గణంబులతో జనాకర్షణ కేంద్రమై నిలిచినట్లు వినికిడి.ఈ మధ్య కాలముననే 1996 లో కీర్తి శేషులయిన మన్నారుపోలూరు గ్రామ వాస్తవ్యులు **కళాచిత్ర ప్రెస్** సంపాదకులైన **శ్రీ ఆర్.యమ్. అంజనేయులు గారు, కీ.శే. కృష్ణస్వామి భరతన్** గారి అర్థిక సహాయం ప్రోత్సాహాలతో, **"మన్నారుపోలూరు - మణిమండపక్షేత్రము"** అను స్థల చరిత్రను 1973 లో అత్యంతవిశేషణములతో సవివరముగా మూడు భాషలలో (తెలుగు, తమిళం, ఇంగ్లీషు)యీ వూరికి మణిమండప క్షేత్రముగా నామమెట్లొచ్చినదో ప్రచురించిరి. సత్రా జిత్తు తన గాఢతపోఫలమున భాస్కర వరప్రసాదముగా పొందిన శమంతకమణి పాఖ్యానము, భాద్రపద శుద్ధచతుర్థిన శ్రీ కృష్ణుడు గోష్ఠమున పాలు పితుకుతూ క్షీరమున చంద్రదర్శనము

గావించుటచే మణిని అపహరించినట్లు నీలాపనిందలు పడుట, తదుపరి త్రేతాయుగమున తన వరప్రసాదముచే జాంబవంతుని కోర్కె తీర్చుటకై అతనితో యీ క్షేత్రమునందే గల గుహను ప్రవేశించి పదునెనిమిది దినములు ముష్టి యుద్ధము గావించుట, తదుపరి సత్య భామా, జాంబవతులను ఏక కాలములో పరిణయమాడుట, మున్నగు బ్రహ్మాండ పురాణములో గల యీ క్షేత్ర వైశిష్ట్యములను అతి మృదుమధుర భాషతోనుడివిరి. ఇంకనూ దేవతలనోడించి తనకన్న మహాబలశాలి యీ లోకమున లేరని విర్రవీగుచున్న గరుత్మంతునకు గర్వభంగము గావించిన విషయము మరియు సర్వంసహా శ్రీ కృష్ణస్వామి తన అధీనుడే అని మిడిసిపడు సత్య భామకు తను చేయలేని పని సాక్షాత్ శ్రీలక్ష్మీ స్వరూపిణియైన రుక్మిణీదేవి సీతా మాతగ ఎనలేని సౌందర్య మూర్తియై శ్రీ కోదండరామ స్వామి ప్రక్కన నిలిచి ద్వాపరి యుగమున ఆంజనేయస్వామికి సాక్షాత్కరించి సత్యభామకు గర్వభంగము గావించుటమున్నగు విషయములు అత్యంత ఆనందోత్సాహములతో కన్నులకు గోచరమగునట్లు యీ స్థల చరిత్ర యందు విశదీకరించిరి.

ఈ మణిమండపక్షేత్రానికి 9 అడుగులు ఎత్తుగల జాంబవంతుడు క్షేత్రపాలకుడుగా స్వామి ఆలయ వెనుక భాగమున ముకిళిత హస్తాలతో సాక్షాత్కరిస్తాడు. శ్రీ రామానుజ, ఉభయ వేదాంతదేశికర్ స్వామి సన్నిధులతో అలరారు యీ వైష్ణవ దివ్య ప్రదేశము అతి ప్రాచీన పుణ్య క్షేత్రము.

యీ మధ్య కాలంలో ప్రజాదరణ లేక అత్యంత దయనీయమైన స్థితిలోనుండుట శోచనీయము. అనేక ఆస్తిపాస్తులు కలిగిన యీ దేవస్థానము రావలసిన చెల్లింపులు చెల్లింపక అన్యాక్రాంతమైయిటు దేవాదాయశాఖ వారు గానీ, అటు యే ట్రస్టు బోర్డు లేని కారణమున అంతా దయనందిన పరిస్థితికి దారితీసినది. 40 మంది దేవదాసీలు, 20 మంది అర్చక కుటుంబములు, దినమునకు 9 తూముల ధాన్యం వండిపెట్టే వ్యవస్థ కుంటుబడి పొట్టచేత బట్టుకొని తలో త్రోవన పోవ, దేవాలయ వృద్ధ అర్చక స్వామి శ్రీమాన్ వీర రాఘవభట్టాచార్యులు గారి కుటుంబం మాత్రం నిలిచివున్నది. 1951 లో ఆలనాపాలనా లేక దేవాలయం మూతపడి పోతే అర్చక స్వామియొక్క అనేక అభ్యర్థనల మేరకు దేవాదాయ శాఖవారు 1954 లో మూసినతలుపులు తెరిచారు.

దేవాలయముకు 100మీటర్ల యెదురుగా తిరుపతిలో వలె ఆంజనేయస్వామి వారి 1000 సంవత్సరముల నాటి ఆలయము మిక్కిలి. శిధిలావస్థలోనున్నది. అధికారుల అలసత్వముననో, దైవభీతిలోపించటం వలననో బేడి ఆంజనేయస్వామి ఆలయంచుట్టూ విశాలంగ వున్న చోటు మెల్లమెల్లగా అనేక అంగడుల వారు అక్రమించుకొని ఆలయమునకిని కూడా కానరాకుండా చేస్తున్నారంటే భారతీయ సంస్కృతి, దేవాలయ వ్యవస్థను ఎంత చిన్న చూపు చూస్తున్నామో గోచరమవుతున్నది.

ఇంకొక పరమ విచారకరమైన విషయం ఏమన యీ క్షేత్రం ముందు ప్రధానరహదారి ప్రక్కనే యున్న ఆలయపు పెద్ద కొలను ఆలనా పాలనా లేక అనేక ముళ్ళ మొక్కలు చుట్టూ పెరిగి చెత్తా చెదారం పోస్తూ మెల్లమెల్లగా అక్రమణకు గురౌతుంటే, దేవాదాయ శాఖవారుగాని ఎమీపట్ట నట్లుగా మౌనం వహించటం శోచనీయం.కొలను మధ్య భాగంలో వున్నమండపం శిధిలమై పడిపోయింది, స్వామివారికి తెప్పోత్సవం ఆగిపోయింది.

ఈ మధ్య 5 సంవత్సరాలకాలంలో ధర్మబుద్ధిపరులు,ఔత్సాహికులయిన సూళ్ళూరుపేట, శ్రీహరికోట, మన్నారుపోలూరు వాస్తవ్యులు ఆలయ జీర్ణోద్దరణ కమిటీగా ఏర్పడి దేవాదాయ శాఖవారిని అభ్యర్థించగా రెండు తఫాలుగా రు. 7,00,000 లక్షల (సి.జి.ఫ్) గ్రాంట్ చేయడంవల్ల దేవాలయం ముక్కాలు భాగం జీర్ణోద్ధరణ జరిగింది. ప్రస్తుతానికి రాజగోపురం పునరుద్దరణ పనులు అనేక భక్తుల విరాళములతో పూర్తయి 27-4-2001 నమహాసంప్రోక్షణము జరుపుకుంటున్నాము.

దేవాదాయ శాఖవారు వెంటనే ఔత్సాహికులయిన మన్నారుపోలూరు, సూళ్ళూరుపేట మరియూ శ్రీహరికోట వాస్తవ్యులతో ఒక ట్రస్టు బోర్డు, వేస్తే, దేవాలయ పెద్దకొలను పునరుద్ధరించడం మొదలగు కార్యక్రమాలు చూచుకొని యీ క్షేత్రపు పూర్వవైభవం తేవటానికి దోహదపడ వీలవుతుంది.

ఈ క్షేత్రానికి 1960 సంవత్సరంలో శ్రీశ్రీశ్రీ జగద్గురు కంచి కామకోటి పరమాచార్యులు వారు చాతుర్మాస దీక్షను జరుపుకొనుట విశేషం. ఏ.పి. ఎన్డోమెంట్‌వారి ద్రవ్యసహాయముతో జీర్ణోద్దరణ కార్యక్రమములు జరిగిన తరువాత తే 2.5.1999 నాడు శ్రీ రంగం జీర్ స్వామి శ్రీశ్రీశ్రీ మత్ ఆండవన్ శ్రీ

రంగరామానుజమహాదేశికన్ వారిచే దేవాలయ అష్టబంధన మహాకుంభాభిషేకము జరిపించడమైనది వారి యొక్క ఆశీశ్సులుతోటే. నాయీ శ్రీ కృష్ణ లీలా వినోదిని (శ్రీమల్ల హరి కృష్ణ శతకము)ను చదివిన వారెల్లరూ యీ దివ్య క్షేత్రమును దర్శించి శ్రీ సత్యా జాంబపతి, శ్రీ సౌందర్య వల్లీ సమేత శ్రీ అళఘుమల్ల హరికృష్ణ స్వామి కృపా కటాక్షములకు పాత్రులగుదురుగాక..

యీ రాజగోపురం కూడా జీర్ణోద్ధరణ కావడంతో శ్రీరంగం శ్రీమత్ అండవన్ స్వామి వారి చేతనే 27-4-01న రాజగోపుర మహాసంప్రోక్షణము జరుప నిశ్చయించితిమి.

స్వామివారి చేతనే నా యీ శ్రీకృష్ణలీలా వినోదిని (మల్లరికృష్ణ శతకము)ను ఆవిష్కరింపజేసి శ్రీకృష్ణ స్వామివారి దివ్యపాదారవిందముల వద్ద సమర్పించుకొనుచున్నాను. అన్ని పద్యములు పాకే జాతిలో వ్రాయనందునసే యీ నా శతకమునకు శ్రీకృష్ణ లీలా వినోదిని యని పేరుపెడితిని.

ఛందస్సు అంతగా తెలియని నాకు భక్తి ప్రాధాన్యతతో పొరలి యీ పద్యములలో యతి నియమము పాటించనందుకు ప్రాజ్ఞులను మన్నింప గోరుచున్నాను.

నాయందువాత్సల్యంతో, గ్రంథము సరిద్దిన వృద్ధులయిన శ్రీ తెలికిచర్ల రాజేశ్వర శర్మ గారికి గౌరవానురాగాలతో శ్రీయుతులు అమృతవాక్కుల శేషకుమార్ గారికి, శ్రీయుతులు సర్వోత్తమ రావు గారికి నా మేనమామ గారైన శ్రీమాన్ మాడభూషి శ్రీనివాసాచార్యులు గారికి చివరిగా నా ఆత్మమిత్రులైన కీ.శే. ఆర్.యం.అంజనేయులు గారి కుమారుడు చిరంజీవి భాస్కర్ అతి స్వల్పకాలంలోనే పుస్తకమును సర్వాంగ సుందరముగా తమ కళాచిత్ర ప్రెస్‌లో ముద్రించినందుకు నా మనః పూర్వక అభివందనములు.

**Prof. S. B. Raghunathacharya**
DIRECTOR GENERAL



TIRUMALA
TIRUPATI
DEVASTHANAMS

Sri Venkateswara
Institute of Higher Vedic Studies
S.V. Central Library Building
Chandragiri Road, Tirupati - 517 502
INDIA
Tele - Fax : 08574 - 48087

# అభినందనమ్

శ్రీమాన్ ఋక్షపట్టణం తిరుమల ఆనందరామాచార్యులవారు నాకు చిరకాలమిత్రులు. వీరు శ్రీహరికోటలోని షార్ కేంద్రంలో చాలాకాలం క్రయకార్యనిర్వహణాధికారిగా సేవచేసి ఈ మధ్యనే విశ్రాంతినొందారు. ఋక్షపట్టణం వారి వంశం పండిత వంశం. వీరి తాతముత్తాతలు సకలశాస్త్ర పండితులుగా, మహాప్రబంధరచయితలుగా సంస్కృతాంధ్ర భాషలలో శతావధానసంవిధాన చతురులుగా లబ్ధప్రతిష్ఠులైనవారు.

శ్రీమాన్ రామాచార్యులవారి వృత్తి సాంకేతికమైనది. ప్రవృత్తి సంగీత సాహిత్యాలలో సరసమధురమైనది. వీరు అనర్గళమైన గాత్రంలో ఎన్నో పౌరాణిక నాటకాలను ప్రదర్శించి, వాటిద్వారా లభించిన నిధులతో మన్నారు పోలూరులో గల అలఘుమల్లవారి శ్రీకృష్ణసాక్షి దేవాలయాన్ని పునరుద్ధరించి ధన్యజన్ములైనారు. అంతేకాదు; 'శ్రీకరధ్యాయి' అనే సంస్థను స్థాపించి భాగ్యనగరంలోను, శ్రీహరికోటలోను ఎన్నో సంగీత సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూ, కవి పండితులను సముచితంగా

Residence 6-6 Sri Satya Sai Nagar, Tiruchanoor Road, TIRUPATI-517 503, A.P.
Tele-Fax 08574-39113, 39309

III

యల్లివారి పాదసన్నిధి నుల్లమునర
నుంచి సేవించి ధరియించి మెప్పుదనర
శతకశతపత్రమర్పించి శాంతిమీర
ధన్యులైనారు రామార్య! ధరణి మీర.

— రఘునాథాచార్య

ఆరకుటి
16-4-2001

శ్రీ తెలికిచెర్ల రాజేశ్వరశర్మ
వేద శాస్త్ర పండితుడు
వేదశాస్త్ర పారాంనిధి,
సాహిత్య విద్యా ప్రవీణ

విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయులు
యమ్. హెచ్. హై స్కూల్,
శ్రీకాకుళం.
11-1-2001

## పరిశోధనాత్మక అభిప్రాయము

నా పూర్వజన్మ పుణ్య ఫలముగ శ్రీ మల్లహరికృష్ణుని శతకమును శ్రీమాన్ బి.టి. ఆనందరామాచార్యులు గారు వ్రాసిన దానిని పరిశోధించి నా శక్తి కొలది దిద్దితిని.

శ్రీ ఆచార్యులు గారు ఆస్తికులు, నాకు పుత్ర ప్రాయులు. నాకు వారు వ్రాసిన శతకమును నా అభిప్రాయమునే గాక తప్పులున్న సరిచేయుటకు పంపగా, చందస్సు కాన, యతి ప్రాసలు సరిచేసితిని. అవిధముగా నాకునూ శ్రీ మల్లహరికృష్ణ శతకమును అమూలాగ్రముగా పరిశీలించుటమైనది.

నాకు సంస్కృత శ్లోకములు వ్రాయుట తెలియును. తెనుగు పద్యములు, అందునను కంద పద్యములు వ్రాయుట సామాన్యమైన పనిగాదు. శ్రీ మల్లహరికృష్ణ స్వామి వారి దయ లభించుటచే సరిదిద్ద గల్గితిని. అర్థ గాంభీర్యముతో కందపద్యములు వ్రాయగల్గిన దిట్ట కవి బ్రహ్మ తిక్కన సోమయాజిగారు. ఆయన వ్రాసిన ఆంధ్రమహా భారతముకాన ఖ్యాతి గల్గినది.

శ్రీ మాన్ బి.టి. ఆనందరామాచార్యులు గారికి అనేక జీర్ణ దేవాలయోద్ధరణ ఆ బాల్యమునుండియే లభించినది. ఒకటి రెండు కాదు నాలుగు దేవాలయము లను బాగు చేయించినారు, ఆయనుభవముండుట వలననే శ్రీహరికోటలో ప్రధానమైన శ్రీకామాక్షీదేవీ ఆలయము, శక్తి పంచాయతనముగా శ్రీ కంచి కామ కోటి పీఠాధిపతుల సలహాలతో తోటి కమిటీ మెంబర్లతో కలిసి కృషిచేసి, ఆంధ్రప్రదేశ్ దేవాదాయ శాఖవారి (సి. జి.యఫ్) ధన సహాయముతోనే గాక అనేకయాస్తికుల నుండి విరాళములతో అతి శద్ధా భక్తులతో, సర్వాంగ సుందరముగా కట్టించి శ్రీహరికోటలో యావత్ భక్తులకు మహదానందమును కల్గించినారు.

ఇంతియేగాక నేను రచించిన 1). శ్రీ రుద్రాభిషేకమహాత్మ్యము 2). శ్రీసౌరారుణ మంత్ర రహస్యములు (సూర్యనమస్కార ప్రభావము సౌరభాగము) తిరుపతి తిరుమల దేవస్థానము వారి ద్రవ్య సహాయముతో నే గాక అనేక మంది విరాళములతో ముద్రించి వెలుగులోనికి తెచ్చిరి. ఈ మధ్య కాలములోనే వారి ముత్తాత గారైన శ్రీమాన్ బి.టి, రాఘవాచార్యులు గారు వంద సంవత్సరముల క్రితం వ్రాసిన గ్రంధమును టి,టి,డి వారిద్రవ్య సహాయముతో వారిమేన మామగారు మాడభూషి శ్రీనివాసాచార్యులు గారు,రిటైర్డు సబ్ రిజిష్ట్రార్, కోపరేటివ్ శాఖ, పొన్నూరు వారి ప్రోద్బలముతో ముద్రించి ఘనముగా సూళ్ళూరుపేటలో ఆవిష్కరణ జరిపి సూర్యావలోకనము గావించిరి. స్వయంగా వారిమేనవదిన గారు శ్రీమతి మహాభాష్యం పేరుం దేవి గారు స్వరపరచిన శ్రీ అన్నమయ్య కీర్తనావళి పుస్తకమును ముద్రించి సంగీత విద్వాంసులైన శ్రీయుతులు నూకలచిన్న సత్యన్నారాయణ గారి చే హైదరాబాదులో ఆవిష్కరణ గావించిరి. ఇంతయేల ఈనాడు నేను రచించిన మహాగ్రంథము "శ్రీసౌరారుణమంత్రరహస్యములు (శ్రీ సూర్య నమస్కార ప్రభావము - అరుణభాగము) ముద్రణ గావించుటకు నడుము కట్టినారు.

ప్రస్తుతము దైవానుగ్రహముచే మన్నారుపోలూరులో వేంచేసియున్న **శ్రీ అళఘుమల్లహరికృష్ణస్వామి వారి శతకమును (శ్రీకృష్ణ లీలా వినోదిని)** సహజముగా వ్రాసి నాచే పరిశోదన చేయించినారు. 80 సం. వృద్ధుడనై బలహీనుడనైననూ కేవలం **శ్రీ కృష్ణ స్వామి** వారి మహిమచే యీ కృతిని సరిచేయగల్గితిని. మహాగురుభక్తి సంపన్నులుగాన ఆచార్యులు గారు నాచే సరిచేయించినారు. ఎన్నో ఘనకార్యములు చేసిన అతని పుణ్య గరిమ చే భక్తి ప్రపత్తుల సూచకముగా శతకరచన, అందుననూ కందపద్య రచనయు మహా గరిష్ఠము సాధ్యమైనది. బావానుభూతితో భక్తి పారవశ్యంతో, అతి సరళమైన శైలిలో వ్రాసిన శ్రీరామాచార్యులు గారి దివ్య శతకమును భక్తాగ్రేశ్వరులెల్లరూ ఆశ్వాదించి తరించెదరుగాక

Saraswatiputra, Sahitya Kalanidhi
Sahitya Mahopadhyaya, Sabha Vachaspati
**Dr. AMRUTAVAKKULA SESHAKUMAR** M.A., M.A., M.A., M.A., Ph.D.
NELLORE

# రెండు మాటలు

ఆధునిక ఖగోళ పరిశీలన భూగర్భ నిక్షిప్త వస్తు పరీక్షణ, వాతావరణ పరిణామ పర్యవేక్షణ చేసే, అత్యుత్తమ కార్యరంగం అయిన, భారతీయ అంతరిక్ష అనుసంధాన సంస్థ, షార్ కేంద్రము పనిచేస్తూ అతిప్రాచీన భారతీయ సంప్రదాయ పరిరక్షణ భాధ్యతలు నిర్వహిస్తూ, దేవాలయ పున: నిర్మాణ కార్యక్రమాల్లోనూ, సామాజిక కార్యనిర్వహణ లోనూ తలమునకలవుతూ వున్న **శ్రీ బి.టి. ఆనంద రామాచార్యులు** గారు **శ్రీ కృష్ణ లీలా వినోదిని** (మల్లహరికృష్ణ శతకము)ను వ్రాసి భక్తిభావం అక్షర రూపాన్ని కల్పింప చేస్తుందనే సత్యాన్ని నిరూపించిన ఈ నాటి కవి.

పూర్వం పోతన, రామదాసాదులు పద్యరచయితలుగ పొందిన ఖ్యాతి కంటె భక్త కవులుగ పొందిన యశస్సే ఎక్కువ. అలాగే శ్రీరామాచార్యుల వారి రచనలో భక్తి ప్రాధాన్యంవహిస్తుంది. పద్యం అల్లికలో, యతి ప్రాసలలో, దుష్కర ప్రాసనియమ పరిపాలన ప్రశంసనీయం. యతి భంగం భక్తి రసప్లావితం.

శ్రీ కృష్ణుడు జాంబవంతునితో యుద్ధం చేసి జాంబవతిని పొందిన మల్ల (జాంబవంతుడు) హస్తకుని స్థానం కనుక ఇది మల్లహరికృష్ణ స్థానం అయింది. దీనినే మన్నారు పోలూరు అని పిలుస్తున్నారు.

శ్రీ కృష్ణునితో పోరాడిన జాంబవంతుడు కూడా భక్తుడే రామాచార్యుల వారి పద్య రచన విషయంకంటె భావ విషయం చాలాబాగుంది.

ఈ శతకాన్ని శ్రీ తెలికిచెర్ల రాజేశ్వరశర్మగారు పరిశోధన చేసినట్లుగ తెలిపివున్నారు. బహువిస్తృత శాస్త్ర పాండిత్యం కలవారు శ్రీ తెలికిచెర్ల వారు.

*శ్రీరామాచార్యుల వారి పద్యాల్లో*

కం. పుట్టెడి సంతానంబును
పట్టిడ తన యదుటె జంపునన్నను గాంచెన్
పుట్టెడు దుఃఖిత దేవకి
యెట్లో కంసుని మరల్చె మల్లరికృష్ణా (21వ పద్యం)

ఆన్న పద్యంలో దేవకీ దేవి ఆర్తి, జీవితాన్ని నిలుపుకోవాలనే తహతహ కంసుని ద్వేషం, ఒకటేమిటి భిన్న రసాలు జాలువారుతున్నాయి.

**మరొక ఉదాహరణ :**

కం. సిరిసంపదలున్న వడుచు
పిరుదుల వరకున్న జడ చేరడిలాగన్
చుర చుర చూచె డిముగ్ధకు
మురిపముగా ముద్దొసగితి మల్హరికృష్ణా! (36 వ పద్యం)

ఈ పద్యంలో శ్రీకృష్ణుని చిలిపితనం, ముగ్ధ మోహన సౌందర్యం, ఆమె చిరుకోపం, కృష్ణునిపై ఆమెకున్న ప్రేమ, కృష్ణుడు ఆమె ననునయించిన విధానం, ఆపద్ధతిలో ఆమె పొందిన అమదానం ధానుభూతి, కొట్టవచ్చినట్లు అక్షరన్యస్తం అయ్యాయి. ఇది వర్ణ చిత్రానికి కూడా చక్కటి ఉదాహరణ.

కవి, కందాన్నే గాక ఆటవెలది, కవిరాజవృత్తం, సుగంధి వంటి ఇతరవృత్తాలు ప్రాచీన కవుల శ్లోకాలు వాడడం వలన పాఠకులకు ఈ శతకం అతి సన్నిహితం అవుతుంది అనడానికి చాలా అవకాశాలున్నాయి.

శ్రీకృష్ణుని బాల్య క్రీడలలో రాక్షస సంహారం మృదువుగా చెప్పబడింది. ఆయన సర్వవ్యాపకత్వాన్ని గురించి చెపుతూ

కం. ఒకనెడ దధి చోరుడవై
యొక నెడ వ్రజవనితల వలువలు గొనుచున్
నొక యెడ జగడములెట్టుచు
నొక నెడ సరసము లాడెదు మల్హరికృష్ణా (33 వ, పద్యం)

అనే పద్యం చాలా అందంగా నడిచింది.

నేను అన్య కార్య నిరతి వలన అర్ధ శతక పరిశీలన మాత్రమే చేయగలిగాను. అందులో నేను పొందిన అనుభూతితో శ్రీఅనంద రామాచార్యుల వారిని గురించి ఒక్క మాట విన్న విస్తున్నాను.

మల్లహరికృష్ణ శతకము మలచియిచ్చు
రామచార్యులు ఎంతయు రాణకెక్కు,
రచన సొగసుల వలనను, రామకృష్ణ
కరుణ బెంపులతోడను కవిగ నిలుచు.

**ఆచార్య సర్వోత్తమ రావు**
విశ్రాంత ఆంధ్రాచార్యులు
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

తిరుపతి
16-4-2001

## అభినందన

శ్రీ బి.టి.ఏ. రామాచార్యులు గారు నాకు చిర పరిచితులయిన మిత్రులు. సహృదయులు. వారి వృత్తి ప్రవృత్తులు ఆబాలగోపాలం మెచ్చుకొన్న అంశాలు. వారిది పండిత వంశమని నాకు తెలుసుగాని శ్రీ రామాచార్యులు కవులని నాకు తెలియదు. దానికి వారిలో దాగియుండి బయటకు వచ్చిన ప్రథమ పద్యరచన మల్లహరి (మల్హరి) కృష్ణ శతకమే సాక్ష్యం.

తెలుగువారు తమదని చెప్పుకోదగిన సాహిత్య ప్రక్రియలు అవధానం, పద్యనాటికలు, యక్షగానాలు, భువన విజయం, శతకం మొదలయినవి.

తెలుగువారు శతకాలను అభిమానిస్తారనటానికి వేల సంఖ్యలో శతకాలు వుండటం సాక్ష్యం. తెలుగులో మొదటిశతకం భక్త్యాత్మకం. శ్రీరామాచార్యుల వారి మల్హరికృష్ణ శతకం కూడా భక్తి శతకం.

శ్రీ రామాచార్యుల వారు కృష్ణ భక్తులు. భగవత్ భక్తి యెంత మానసిక మైనా బాహ్య జగత్తులో ప్రకటితమైనప్పుడే యందరో అనుసరించటానికి వీలౌతుంది. ఈ శతకంలో దశావతార వర్ణనలు, శ్రీకృష్ణలీలలు వర్ణితం. శ్రీరామాచార్యుల వారు కందం, కవిరాజ విరాజితం, సుగంధి, తన్వి ఆటవెలది చంపకమాల, ఉత్పలమాల, శార్దూల చందస్సులలో రచనలు సాగించారు. ఇదొక వినూతన పద్ధతి. ఉప్పొంగిన నదీ ప్రవాహంలో నానా రూపాలలో వ్యక్తంకావడం తప్పేమీలేదు. అయినా సాంప్రదాయకారులు యేమంటారో.

శ్రీరామాచార్యుల వారి తొలి ప్రయత్నం యీ శతక రచనలో భావం పూలవాసనలాంటిది. రచన పూల నిర్మాణం లాంటిది. రంగుల పుష్పాలు, వాసనల పుష్పాల కన్నా రంగూ - వాసనలున్న పూలు అందరినీ అలరిస్తాయి. కృష్ణావతారక థనం పూలవాసనలైతే, ఎన్నుకొన్న చందస్సు భాష పూలపై పూతలాంటిది.

భవిష్యత్తులో శ్రీ రామాచార్యులుగారు శ్రమించి భక్త్యాత్మక రచనలు చేయాలని ఆకాంక్ష, భగవన్నామం, భగవత్కథనం, భాగవత్కీర్తనం యే రూపంలోవున్నా సమాదరణీయం.

**కె. సర్వోత్తమరావు**
తిరుపతి

**M. SREENIVASACHARYULU, H.D.C.,**
Co-Operative Dy. Register (Retd.)

H.No. 1-4-35
Bhavanagar Colony,
PONNUR - 522 124.
Guntrur - Dt. (A.P.)
11-4-2001.

## శుభాశీశ్శ

## అభిప్రాయం

నిత్య దైవస్మరణ చేయు ప్రపన్నులు తనను చేరుటకు కావలసిన భక్తిజ్ఞాన వైరాగ్యములను ఆ శ్రీహరియే ప్రసాదించును. నా మేనల్లుడు బుక్కపట్నం తిరుమల ఆనందరామాచార్యులు దైవానుగ్రహముతో రచించిన మల్లహరి కృష్ణశతకము (శ్రీకృష్ణ లీలా వినోదిని) స్వయముగా చదివి వినిపించినప్పుడు ఆనందముతో పులకితుడనైతిని. ఈ శతకమును శ్రద్ధతో చదువు వారికి, వినువారికి మహానందము చేకూరును.

ముఖ్యముగా రామావతారమును వర్ణించుచూ వ్రాసిన -

కం. రాముని బోలిన నరపతి
భామిని ధరసుతను బోలుసతియునుగలదే
రాముని సత్కర్మలచే
భూమియు శాంతమున వెలిగె మల్హరికృష్ణా 11వ. పద్యం

రామ రాజ్యమును యిప్పటికి యెందుకు కొనియాడెదరో తెల్లడమైనది. అటులనే దేహ ఆత్మల విషయమై దేవకీదేవికి ఆమె సుతులు తెలపుతూ

కం. ఎందరికో సుతులైతిమి
ఎందరికో తలి దండ్రుల మేమైతిమిగా
నందనులని తలచకయా
నందకరముకుందుని గను మల్హరి కృష్ణా

అన్న పద్యం ప్రతిజీవి, దారాపుత్రాదుల యందు అతిగా భ్రమతో మోహపడక ఆశ్రియః పతిస్మరణలో యెట్లుండ వలెనో యున్న గీతా సారమును నుడివెను.

వేరొక నెడ 56వ పద్యమున రుక్మిణీకల్యాణ ఘట్టమున రుక్మిణీ దేవి కృష్ణుల వారికి వ్రాసిన లేఖను ప్రపంచమున "తొలి ప్రేమలేఖ" అనుట చాలా యింపై ముచ్చటగా నున్నది. ఒకట నేల స్యమంతకమణోపాఖ్యానము, పారిజాతాపహరణము పద్యములు తనదైన శైలిలో చక్కటి తేలికైన పదములతో కళ్లకు కట్టినట్లు వ్రాశాడు. మంగళాశాసనము చివరి పద్యము క్షేత్రమునకు తగినట్లుగానున్నది. అతని రచనలో మల్లారి కృష్ణా అనుమకుటము భక్తి భావన, ఆర్తిని, భక్తిని తోణికిసలాడు చుండుటకు అతనికి పెద్దల యందుగల భక్తి, శ్రద్ధ, ప్రేమ, వాత్సల్యాదులకు నిదర్శనము. ఆనంద రామాచార్యులు కవి నా మేనల్లుడగుట నాకు సంతోషకరము గర్వకారణము

ఆశీస్సులతో

మాడభూషి శ్రీనివాసాచార్యులు

11-4-2001

# ఓం నమో నారాయణాయ

## 1. ఆచార్య స్తుతి

రామానుజదయాపాత్రం
జ్ఞాన వైరాగ్య భూషణం
శ్రీమద్వేంకట నాథార్యం
వందే వేదాంత దేశికమ్

శ్రీరంగ నాథ శఠగోపయతీంద్రదృష్టం
లక్ష్మీనృసింహ శఠజిత్ కరుణైక పాత్రం
శ్రీ రంగవీర రఘురాట్‌శఠగోప హృద్యం
వేదాంతదేశిక యతీంద్ర మహంప్రపద్యే

శఠమూర్ధాన్వయోద్భూతం
రాఘవార్య గురోస్సుతం
ఆచార్యపుత్ర కులజం
నృసింహార్య గురుంభజే

# 2. దైవ ప్రార్థన

శ్లో॥ వసుదేవసుతం దేవం
కంస చాణూర మర్దనం ।
దేవకీ పరమానందం
కృష్ణం వందే జగద్గురుం ॥

శ్లో॥ కస్తూరీ తిలకం లలాట ఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రేనవమౌక్తికం కరతలేవేణుం కరే కంకణం
సర్వాంగేహరి చందనంచ కలయం కంఠేచముక్తావళిం
గోపస్త్రీపరివేష్ఠితో విజయతే గోపాల చూడామణీ: ॥

శ్లో॥ శ్రీ కృష్ణా,యదుభూషణా, నరసఖా శృంగార రత్నాకరా
లోకద్రోహినరేంద్ర వంశదహనా లోకేశ్వరా దేవతా-
నేక బ్రాహ్మణ గోగణార్తి హరణా నిర్వాణ సంధాయకా
నీకున్ మ్రొక్కెద దృంపవే భవలతల్ నిత్యానుకంపానిధే

ఆ.వె. చేత వెన్నముద్ద చెంగల్వపూదండ
బంగారు మొలత్రాడు పట్టుధట్టి
సందె తాయత్తులును సరిమువ్వగజ్జలు
చిన్ని కృష్ణానిన్ను చేరికొలుతు

# కృతి సమర్పణ

1 కం. ఇందిర రమణు నివేదెద
అందముగా కృష్ణ శతక రచనను బ్రోవన్
మందుడనగు నామదిలో
సుందరమగు పదమువెలయమల్లారి కృష్ణా

2 కృష్ణునకును పరిపాలిత
జిష్ణునకు సుమనోహర గోపీ పాలక
కృష్ణునకు లోక రక్షకు
విష్ణునకు నిచ్చు సుకృతిని మల్లారికృష్ణా

3 రక్షక మగు వాసుదేవు
నక్షర జపమే మనలను ధన్యులజేయున్
తక్షణముగ మామదిలో
నక్షరమును నిల్పుమయ్యమల్లారి కృష్ణా

**దశావతారవర్ణనము**

4 భక్తుల కోర్కెలు దీర్పగ
యుక్తిగ నాలుగు యుగముల చక్కని ప్రేమన్
శక్తితో నిలనవతరించి
ముక్తిని ముదముగ నొసగవె మల్లారి కృష్ణా

**మత్స్యావతారము :**

5 కం. చోరుని వలె దధి జొచ్చిన
మారకుడగు వేదహర్త సోమకుగొనవే
జోరిని వలె నొక తృటిలో
మారకు రక్కను ద్రుంచిన మల్లారికృష్ణా

**కూర్మావతారము :**

6 కం. దానవ దేవగణంబులు
దీనతతో నిన్ను జేరకూరిమి తోడన్
మేనున మంధరమిడుకొని
బానన వ్రుత మొసగలేదె మల్లారికృష్ణా

**వరాహావతారము :**

7 కం. వడిగా భూమిని జుట్టియు
నడిసంద్రములో సువర్ణ నయనుడు వేయన్
వడిగా వరాహమైతివి
వడిగా మము కాచినట్టిమల్లారికృష్ణా

**నరసింహమూర్తి :**

8 కం. అనవరతము హరినామమె
మనమునస్మరియించునట్టి తనయునితోడన్
తానేదైవంబని యెడి
దానవువధియించి బ్రోచు మల్లారికృష్ణా

**వామనమూర్తి :**

9 క. సురపతి కోరికవడుగై
సిరిపతి చనుదెంచి వేగబలి శిరమునతా
మురిపపు మూడడుగులనా
సురపతిని నేలనడంచు మల్లారికృష్ణా

**పరశురాముడు :**

10 క. దుర్మార్గులైన రాజుల
దుర్మార్గపు పనుల పుడమిభారముచెందన్
దుర్మార్గనృపతి వధచే
ధర్మాలనేలనిపిన మల్లారికృష్ణా

**రామావతారము :**

11 క. రామునిబోలిన నరపతి
భామిని ధరసుతనుబోలు సతియునుగలరే
రాముని సత్కర్మలచే
భూమియు శాంతమున వెలిగె మల్లారికృష్ణా

12 కం. శ్లో. మత్స్య: కూర్మోవరాహశ్చ నారసింహశ్చవామనః
రామోరామశ్చ రామశ్చకృష: కలికిరేవచ
ఏయవతారముగా దగు (గానవు)
ఓ యవతారమూర్తి వనఘ యోసురనాథా
ఈ యవతారంబులుపది
యేయనినేనెట్లు చెప్పెద మల్లారికృష్ణా

## శ్రీకృష్ణ జన్మవృత్తాంతము

13. కం. మోహనరాముని రూపుకు
మోహితులై మునులు రాము కౌగిలియడగన్
మోహనరాముడునుడివెను
మహిపొడమెద కోర్కెదీర్ప మల్హరి కృష్ణా

14. కం. ద్వాపరయుగమున మెండుగ
పాపులగు నరకకంసులు రాక్షసగణముల్
పాపులనేకులు పొడమిరి
ఆపదలొసగుదురాత్ములు మల్హరికృష్ణా

15. కం. సురగణములు మొరపెట్టగ
కరిగిన చిన్మయుడాహరి యభయమొసంగన్
మరుజన్మంబున బుట్టెద
శరణమంనొసంగెదంటివి మల్హరి కృష్ణా

16. కం. దేవకి రమణికినావసు
దేవుని వరుడుగను దెచ్చి పెండిలిచేయన్
దేవతలెల్లరు మెచ్చగ
దేవుని కొడుకుగను గనిరి మల్హరికృష్ణా

17. కం. ఇరువురి కల్యాణంబును
నెరిపముగను జరిపినట్టి కంసుడువేగన్
మురిపపు ముద్దుల చెల్లిని
గారవముగ నంపె వసుతో మల్హరికృష్ణా

18. కం. చెల్లెలు దేవకివడిగా
పల్లెకు పతి తోడఁ దెచ్చు కంసవరునకున్
చెల్లెలి యష్టమగర్భుడు
యుల్లముగొనునని యశిర్థ మల్హరికృష్ణా

19. కం. కుపితుడు కంసుడు వడిగా
కోపముతో ననుజ కుతుక దునుమగబోవన్
కోపము విడివినుమనగా
మాపశిశువుల నిత్తుననెను మల్హరి కష్ణా

20. కం. పట్టెడి సంతానంబును
పట్టిడ తన యెదుట జంపుచున్నను గాంచెన్
పుట్టెడు దుఃఖిత దేవకి
యెట్లోకంసుని మరల్చె మల్లారికృష్ణా

21. కం. అష్టమ గర్భము దాల్చిన
ఇష్టసహోదరి దేవకినతికఠిన ముగన్
నిష్ఠుర చెర బంధించియు
కష్టము కల్గించె యన్న మల్లారికృష్ణా

22. కం. దేవకి యష్టమ గర్భము
శ్రావణ భాద్రపదంబున రోహిణికాగన్
దేవకి మురహరిని తాప్ర
సవించెను నర్ధ నిశిలో మల్లారికృష్ణా

23. కం. గడచిన యుగమున తుదిగా
బడసిన వరముల ఫలమున దేవకి వసుకున్
బొడమెనునరహరి యష్టమ
కొడుకుగ విరిసె యదుకులము మల్లారికృష్ణా

24. **సుగంధి వృత్తము :**
వీడెసంకెలలు - అద్భుతరీతిన్
వీడె బంధములు - కారాగారమ్మున
ఆడె శేషుడును - దారివెంబడిని
వీడెదారినది - వడివడినడిచెడి
రేడ వసువునకు - నావలి గట్టుకు
తోడునుండె - నిశిరాత్రి చీకటియు
వీడెపిల్లడిని - యశోద శయ్యన
ఆడనందు సతి - కన్నియచే గొనె
తోడుకొచ్చెనట - వసుదేవుండిట
వండబెట్టెనట - దేవకివడినిట
కోడికూసెనట - పొద్దుపొడిచెనట
అఘమల్లహరి - శ్రీ కృష్ణప్రభు

25 కం. మగబిడ్డగాడు రా శిశు
తెగమెచ్చగ పుత్రి పుట్టెనీ కోడలగున్
ఇగలేదు ప్రాణభయమును
తెగ వేడె సహింపుమన్నసె మల్లారి కృష్ణా

26. ఆ.వె. ఆడబిడ్డనేమి మగబిడ్డడన నేమి
నాడుబల్కెనపుడు నాకవాణి
నేడు బుట్టునీదు యష్టమ గర్భము
కీడుచేయు నాదు ప్రాణమీడు

27. చం. వినసిక యెంతమాత్రమును వేడినవీడనటంచు నీడ్చినన్
వనితని బాలనంబర వీధినివేగమె పారవైచినన్
కినిశిన బాలికామణియు నంబర వీధిని బల్కెధీరతన్
నినుకడ తేర్చు వాడిదిగొ నీవిక చావును జూడు మాయనన్

28. కం. ఒక నెడ నమ్మకుసుతుడై
ఒక జననికి కొడుకు గజని పెరిగితివౌరా
ఒక నెడ మురళిని గనుగొని
ఒక యుగమున నరులగాచు మల్లారికృష్ణా

29. కం. చనులకు గరళము బూసియు
చనుదెంచిన పెనుపూతన మదమణ గంచన్
చనుగవ వేగమ బట్టిడి
చనునటుయూపిరి దీసిన మల్లారి కృష్ణా

30. కం. దొంగ జపం బొనరించెడి
కొంగను గనిన జనంబులు నచ్చెరు వందన్
కొంగను దానవుని గగని
చెంగున జంపగ జీల్చితి మల్లారి కృష్ణా

31. కం. శకటాసురగాల దన్ని
అకటా సురుమెడను బిసికి దునిమితివకటా
వికటాట్ట హాసఫణి ఫణ
ముకుటమునెడ తాండవించు మల్లారి కృష్ణా

## శ్రీకృష్ణా రాసక్రీడలు

32. పరువమున కృష్ణలీలలు
పరుసగ వివరింపతరమె యేరికినైనన్
పరువపు గోపికలెల్లరు
మురిపముగను మగ్ధులైరి మల్లారి కృష్ణా

33. కం. ఒకనెడ దధి చోరుడవై
ఒక నెడవ్రజవనితలవలువలు గొనుచున్
ఒకనెడ జగడము లెట్టుచు
ఒక నెడ సరసములాడెదు మల్లారికృష్ణా

34. కం. సొరసిలి నిదురించెడినీ
పరువపు గోపికలజడలు ముడివేయంగన్
ఇరువురు నిదురనులేవగ
మెరికలు తిరుగుచు నేడ్చిరి మల్లారికృష్ణా

35. కం. నడిరాతిరి పొరుగిండ్లకు
చడిచప్పుడు లేక దొంగ మూకలతోడన్
కడవల నుండిన వెన్నను
కడుపారగతినగ బోవు మల్లారికృష్ణా

36. కం. సిరిసంపదలున్న పడచు
పిరుదులవరకున్న జడను చేరిడిలాగన్
చురచుర చూచెడి ముగ్ధకు
మురిపముగా ముద్దొసగితి మల్లారికృష్ణా

37. కం. మన్నునుతింటి వటంచని
విన్నతి జనని యశోదకు మిత్రులు చెప్పన్
మిన్నక నోటిని జూపగ
అన్నిజగమ్ముల చూపిన మల్లారికృష్ణా

**38.** కవిరాజవృత్తము (క.వృ)
ఉండలేమమ్మరో - యూరొదిలిపోయెదము
తుంటరినీకొడుకు - తంటాలు పెడతాడు
ఊరిమీదనుపడుచు - ఉట్ల మీదుండెడి
పాలు పెరుగులు త్రాగి - పారిపోతుంటాడు
వెన్న ముద్దలు తింటు - వెక్కిరిస్తుంటాడు

దొంగిలించి యుతింటు - ఎంగిలీ చేస్తాడు
మాపిన్నపడుచుల - పరువునే తీస్తాడు
వెడలి పోయెదమమ్మ - ఓయశోదమ్మ

39. ఆ.వె. చెడ్డవాడని కాదు దొడ్డడు మంచికి
వీడు నాకు కల్ల దైవమిచ్చె
వీడు చేయుపనులు తుంటరితనమంచు
వేడుకొందు నేను మంచి గొనుడు

40. ఆ.వె. మాయలాడు గాడు మర్మంబులెరుగడు
వయసు పిన్న లార వాదులేల
వీడు పిల్ల వాడు వీటనుండునేడు
మాయ పనులు మీరు మానుకొనుడు

41. ఉ. దేవుడనేనుగాక మరి దేవుడు లేడని మానెలంతనున్
దేవుల మూర్తులంగలయు బెట్టుచు నెంగిలి జేయుచుండెనన్
దేవియశోద నాకొడుకుజేయగ నేరనివాడనన్ తెగన్
దేవుడు యేమి యున్నెరుగ నేరని వానిగ జేరె తల్లిటన్

42. విసిగిన యాదవకాంతలు
విసిగి యశోదకును దెల్ప వేగమ వచ్చెన్
రుసరుసరోటికి కట్టగ
అసతి కడుపాట్లు పడెను మల్హరికృష్ణా

43. కం. దొరలెడివడి పెను రోటిని
ఇరువరుసల తరుల మధ్య కీడ్చు చులాగన్
విరిగినయా తరులనుండి
సురలొడిమిస్తుతించి జనిరి మల్హరికృష్ణా

**కంసునివధ**

44. కం. తనుబంపిన రాకాసులు
చనినంతనె తిరిగిరారు యొక్కరునైనన్
కినిశిన కంసనరేంద్రుడు
మనమున వెరచుచునుండెను మల్హరి కృష్ణా

45. కం. యాగము చూచెడినెపమున
వేగమె బాలకుల కృష్ణ బలరాములనున్
తేగను బంపెను మంత్రిని
రేగెను శంకలు కంసుకు మల్లారికృష్ణా

46. కం. బలరాముకృష్ణు వేగమె
అలవోకగతోడి తెచ్చు వారినిగనియున్
బలకరికువలయ పీడము
విలయపు ఘీంకృతులంబడె మల్లారికృష్ణా

47. కం. మదమున కరితాపైబడ
యదుకుల నందను డాకరి దంతముద్రుంచెన్
మదకరితుండముద్రుంచగ
తుదకది కుప్పగను కూలె మల్లారికృష్ణా

48. కం. అదిగనియచ్చెరు వందుచు
మదగజ ములవంటి మల్లభటులను బోరన్
బదిలముగ బట్టి యెత్తుచు
పదిలంబుగ వారి జంపె మల్లారికృష్ణా

49. కం. పిల్లల ప్రతిభను గాంచియు
యెల్లరు వారిని యతిగను కొనియాడంగా
పెల్లుబికెడి యక్కసునణచు
అల్లుళ్లను బిలిచెనింటికి మల్లారికృష్ణా

50. కం. లోపలికి జనినవారిని
సై పనటంచని కంసుడు ఖడ్గముతీయున్
లేపినకరమటె నిలువగ
పాపపు కంసుని దునిమిన మల్లారికృష్ణా

51. కం. ఆశ్చర్యంబున నందరు
నిశ్చలులై ప్రణతులిడెరి శ్రీకృష్ణునకున్
బృశ్చుల జైనాదంబుల
నిశ్చితపితరులగాచిన మల్లారికృష్ణా

52 కం. దేవకి కృష్ణుని మెచ్చుచు
దేవుడవందురు నెల్లరు నిను మ్రొక్కుచునున్
తేవగ రాదకొముగిజన
భావజ మెచ్చుదురందరు మల్లారికృష్ణా

53. కం. ఎడతెగ వగచెడి తల్లిని
కడునాదరముగ నోట్టిడి తన నోదార్చెన్
వడినెడి గావున్నవారిని
కొడుకుల గొని దెచ్చి చూపె మల్లారికృష్ణా

54. కం. సుతులను ఆనందముతో
సతి దేవకి కడు ప్రేమతొ చేగొన బోవన్
సుతులామెను యావగించి
నీతులు పల్కిరి యామెతో మల్లారికృష్ణా

55. కం. ఎందరికోసుతులైతిమి
ఎందరికో తలిదండ్రుల మేమయితిమిగా
నందనులని తలచకయా
నందకర ముకుందుని గనుమల్లారికృష్ణా

## రుక్మిణీ కల్యాణం

56. కం. పాపియగు రుక్మి చెల్లిని
పాప శిశుపాలు కాలుగ జేయను కోరన్
రూపసి రుక్మిణి పంపెను
బాపనితో హరికి లేఖ మల్లారికృష్ణా

57. కం. వగచెడి రుక్మిణి వ్రాసిన
జగమున తొలి ప్రేమలేఖ గొనియిదెద్విజుడున్
ఖగమున రివ్వున వచ్చియు
మగసిరి సతి గొనిపోవగ మల్లారికృష్ణా

58. కం. వలదని వెంబడి వడుచును
తులువలు శిశుపాలు రుక్మిదుర్మతులెల్లన్
పలురీతులనుగ్గించియు
చెలిరుక్మిణి పెండ్లాడిన మల్లారికృష్ణా

## స్యమంతకోపాఖ్యానము

59. కం. సత్రాజిత్తు నరేంద్రుడు
మిత్రున ఖండముగగొల్చి వరమునబొందెన్
చిత్ర స్యమంతకమణి ప
విత్రతనను గొల్చుచుండె మల్హరికృష్ణా

60. కం. ఆమణి పాశస్త్యంబున
భూమణి మణిభూషణముల భాసిలుచుండెన్
గ్రామణి జనక్షేమముకై
ఆమణి కోరగ కాదనె మల్హరికృష్ణా

61. కం. తనయన్నను మతిగొనియున్
తన మెడ మణిదాల్చి వేటకడవికి జనినన్
వన రాజా మణి యాసని
వానిదునిమి మణిగొనిజనె మల్హరికృష్ణా

62. కం. అటు బోయెడి సింగము గని
పటుభ్రాంతిని మణినిగాంచి దునిమెనుదానిన్
పటుతర రత్నంబున్గొని
ఝటితి జాంబడు మణి సుతకిడె మల్హరికృష్ణా

63. ఉ. ఎంతకు రానితమ్మునికి చింతిలు చున్నపుడే మనంబునన్
కొంతను మానముందగుల నేరగ కోపము బెంచుకొంచు స్య
మంతక మీనికారణమకారణరీత పవాదువేసెడిన్
పంతముబూని శౌరితన తమ్ముని జంపె నటంచు పల్కెడిన్

64. కం. కడకిటు పల్కెడి మాటలు
పడె యదుకుల నందుని చెవియతినిష్ఠురతన్
కడునపనిందలపాల్బడ
కడుదిటవుతో మణికనజనె మల్హరికృష్ణా

65. కం. పురజనులను కొందరగొని
దరిదాపులనడవితేగి యటవీక్షించెన్
దురితముగను పడ్డ శవమా
పరిసింగపు పదగుఱుతులు మల్హరికృష్ణా

66. వనరాజేగిన గుఱుతుల
జనుల తొనడచుచుశ్రీహరివడివడియేగన్
కనియెను సింగపు శవమిం
కనుభల్లుక పదగుఱుతులు మల్హరికృష్ణా

67. కం. ఎల్లరు సంతోషముతో
భల్లుని పదగుఱుతులుగొనిముందుకు సాగన్
పెల్లుబికెడి యానందము
భల్లుని బిలమును గాంచిరి మల్హరికృష్ణా

68. కం. తన వెనుకను వచ్చినపుర
జనులను నిలిపియును శౌరిబిలమున జనియెన్
కనెమణిమయదీప్తిని మరి
కన్నియగుణ జాంబవతిని మల్హరికృష్ణా

69. కం. మెల్లనమణి గొనిపోయెడి
నల్లని కృష్ణుని గని యాకన్నియయేడ్వన్
ఘొల్లున దాదియునరువగ
భిల్లున భల్లుడునిలిచెను మల్హరికృష్ణా

70. తన్వీవృత్తము (త.వృ). నఖముల రక్కుచు - శిఖలపీకుచును
నోటన గొరుకుచు - కాలతన్నుచున్
ముష్ఠి ఘాతముల - గట్టిగ కొట్టుచు
కృష్ణుని పై బడి - యుద్ధము సల్పెను
భల్ల వల్లభుడు - జాంబవంతుడున్

71. అంతకుమించి - పరాక్రమవంతుడై
విచలతనొందక - చతురత తోకడు
ముష్టికి ముష్టియు - ఘాతుకు ఘాతము
ఘోరభయంకర - యుద్ధము సల్పెను
దివారాత్రములు - ఇరువది దినములు
కృష్ణునిపోరుకు - జంకెను భల్లుడు
శిథిలత చెందెను - విచలితుడయ్యెను
జాంబవంతుడిక - శరణువేడెను
అళఘు మల్లహరి - బిరుదు నొసంగెను

72. ఉ. రామవతారమున్ తనకు సాయముచేసిన కారణమ్మునన్
కామజరూపులన్ వినయ బంటుల కోర్కెల కోరుకొండనన్
తామసకోర్కెనున్ సమర మప్పుడు భల్లుడు కోరెవింతగన్
రాముడు తెల్పెతీర్చెదను ద్వాపరమందనె మల్లారికృష్ణా

73. చ. అదివిని భల్లవల్లభుడు భక్తిని శౌరిపదంబులన్ బడన్
వదలుము నల్లనయ్య నను బ్రోవుమటన్ దయ జూప వేగమే
పదములయాన యివ్విధిని నన్నెదురడ్డిన వాడు లేడిలన్
మదమడ గంగె నాదుతను వెల్లడలన్ మల్లారికృష్ణా

74. కం. భల్లుని భయమడగించియు
వల్లభుడతి సాదరముగ నతనికి తెల్పెన్
కల్లగ సత్రా జిత్తుడుకాం
తిల్లెడి మణి కొంటిననియె మల్లారికృష్ణా

75. కం. అపవాదును బాపుకొనగ
అపరాధుడకాని నేను వడి గుహచేరన్
నెపముల నెంచక నాపైయ
నుపుము మణి నొసగినన్ను మల్లారికృష్ణా

76. కం. కాంతులు జిల్లెడి మణి గొని శ్రీ
కాంతుని తోడనిటుల భల్లుడువేడెన్
కాంతసుత జాంబవతినీ
కాంతగదయ తోడ కొనుము మల్లారికృష్ణా

77. సచరితమ్మది జాంబవతిని
సుచరిత శ్రీహరిజేగొనె రాక్షస విధినిన్
విచలితు భల్లుని వీడ్కతొ
సచరితుప్రజతోడ నేగె మల్లారికృష్ణా

78. పౌరులయెదుటను శ్రీహరి
జరిగిన విషయము దెల్పెను సత్రా జితుకున్
పరితాపము చెందిరాజు
వరదునిక్షమియింపవేడె మల్లారికృష్ణా

79. తన తప్పును పరిహరింప
మనమొప్పగ సత్యనొసగి చేకొనగోరెన్
జనమెప్పగ స్యమంతకమును
తనుగొప్పగ సత్యకొసగె మల్లారికృష్ణా

80. కం. అల్లుని నిరువైపులగని
పిల్లల నిరువుర నిడుకొని యతివైభవమున్
ఉల్లస మనమున మామలు
మల్లరి మనువును జరిపిరి మల్హారికృష్ణా

81. శా. సత్రాజిత్తునరేంద్రుడున్ భల్లవల్లభున్ ప్రాయస్చిత్తంబుగన్
భ్రాతృత్వంబును పెంచు నావస్యకతన్ బంధు మిత్రులన్ బిల్చి
సంతృప్తిన్ తమ పుత్రికామణుల కళ్యాణంబు కృష్ణుతో జేసిరా
క్షేత్రమ్ముమణి మంటపంబను దివ్య క్షేత్రంబుగా వర్ధిల్లెడిన్

**నరకాసురవధ**

82. చ. నరకుడు లోక కంటకుడు ధారుణిపైబడి ప్రాణులెల్లురన్
తిరుగుతు చంపుచుండె నతి క్రూరతతో చెలగంగ నేరగన్
చరితత్రిలోక నాథుడు పరాక్రమవిక్రముకు విన్నవించగన్
పరితమనస్కులూరట గల్లగ కల్త విడుడంచు బంపె శ్రీహరీ

83. కం. పడుచుంటిమియతి బాధలు
పడలేమిక నరకుడు యిడునిడుములనెన్తన్
కడకిటుపడితిమినీకడ
కడగండ్లను తీర్చుమయ్య మల్హారికృష్ణా

84. చ. ఇకనిటునెంతమాత్రమునుసైపనటంచనె శౌరిపల్కెనా
రకునికి మారకగ్రహము చేరువయయ్యెనటంచుసత్యయున్
న్నెక్కగనుతేరు తోలగను నేగ మురారినికూడి యుక్తితో
నికయెటు బోవుతుంటరికడంగులు నేవిధి కల్లజేయునే

85. కం. పశుపతి వరముల బడసిన
అశరశస్త్రమ్ములతోనసురరణ మొనరింపన్
డశలెను తేరునమురహరి
వశమగునా సత్యదాటమల్హారికృష్ణా

86. కం. అంతట కృష్ణుడు లేచియు
ఇంతియు సత్య సలుపు సమరము గాంచెన్
ఇంతతొ లొంగడు తులువని
గొంతుదు నిమెనిశిసంబరమున మల్హారికృష్ణా

87. కం. నరకుని చెరవిడి వనితలు
హరిచరణములను భక్తితో శరణముజొచ్చెన్
మురహరి సతులను కనుగొనె
వరమున బుట్టిన మునులుగ మల్లారికృష్ణా

అంబురవృత్తము (అ.వృ)

88. మణి మయునకు రుక్మిణి సత్యజాంబవతి
ఫణి కళిందనాగ్నజతి సారసలోచనల
క్షణమిత్రవింద భద్రయన నష్టమ
మణులు పట్టపురాణులుగనుండె మల్లారికృష్ణా

పారిజాతాపహరణము

89. ఆ.వె. కలహభోక్తయొసగె పద్మనాభునకును
పారిజాత దివ్య పుష్పమొకటి
విమలనయనయొసగు సతులలో నీదగు
రాగవతికి ప్రేమరాగవతికి

90. ఆ.వె. కమలనాభుడడ్డె కష్టాల బాలిన
నారదుండు చేయు నారుల యెంపిక
రుక్మిణింట నుంట రుక్మిణికీదగు
కాన సఖియ శిఖనకుసుమంబు తురిమే

91. కం. జరిగిన విషయము నెల్లను
పరుగిడి చెలియలు దెలిపెను సత్యామణికిన్
మురిపపు ముద్దుల సత్యయు
నరిగెనుతనయలక గృహము మల్లారికృష్ణా

92. కం. వడిజనె సఖుడువసంతుతో
తడబడునడుగులను సత్య మందిరమునకున్
ఎడతెగునావేశంబున
కడుగడనరి భామయల్గె మల్లారికృష్ణా

శ్రీ కృష్ణ లీలా వినోదిని ఆవిష్కర్త :



శ్రీశ్రీశ్రీ శ్రీరంగం, శ్రీమత్ ఆండవన్ స్వామి

93. కం. ఎంతయు జాలిగ బల్కెడి
కాంతుని పలుకులు తాసరకున గొనతే
కాంతపు చరణము పైబడ
కాంతుకి పాదము తగిలెను మల్లారికృష్ణా

94. కం. జరిగిన పనికిని వెరచుచు
పరితాపము చెందెడు సత్య భామకు చెప్పెన్
మురిపపు మాటలు వేడుక
వరమడుగుము తీర్తుననియె మల్లారికృష్ణా

95. చ. కుసుమము పారిజాతమును రుక్మిణి కిచ్చియు వేడుకన్ జడన్
రసికత జొన్పె సత్యకవమానముకల్గెనటంచు తానుతో
డిసవతులందు మీదికి తలెత్తి యునేవిధి మానమున్ జెడన్
మసలెదనింక బూటకపు నాటకముల్ విడివేగపొండికన్

96. ఉ. ఇంతటి దానితే వగవనేరదు నీవిటబేల పోలెతో
చింతిలనే లకోకుసుమకోమలి నీవడుగంగ నే వడిన్
యంతటి పుష్పమేలత్రుటి భూ రుహమైనను తేగలాడనే
పంతము వీడి వేగమిక రాగదొనాకము నేగిరాదగన్

97. కం. నాకము చూచెడి మిషతో
నేకము గను సత్యను గొని మురహరి జనగా
లోకమునను లేని విగని
ఏకతనుసత్య సురవటము గోరె మల్లారికృష్ణా

98. కం. పారిజభూరుహమివ్వని
వారిజునితో పోరు సల్పి జయమున బొందెన్
ధీరత సత్య గృహమ్మున
పారిజవటమును నాటిన మల్లారికృష్ణా

99. కం. పారిజమును తనయింటను
పారిజపుష్పము రుక్మిణి యింటను గనెడిన్
సారసనేత్రకు సత్యకు
నేరగ విచారముగల్గె మల్లారికృష్ణా

## శ్రీ కృష్ణ తులాభారము

100. కం. యోచన చేసెడి సత్యకు
నుచితముగనుహితము చెప్పెనారదుడపుడున్
కించిత్పతి దానమ్మును
ఇచ్చిన పతి తన వశమౌననెమల్హారికృష్ణా

101. చ. ధనము నగూని వేరిత రముల్ని డి భర్తనుచేగొ నన్ దగున్
యనగ మురారినారదు కుదాన మొసంగి తరాజు నిండగన్
ధనమిడితూచ జాలక వివేక విహీన తజూచె జాలిగన్
తనసవతీల,రుక్మిణికిదెల్పగ దూచె కృష్ణునితుల్సితో

## గరుడ గర్వభంగము

102. కం. ఖగరాజనె తెగనొకపరి
జగమెరిగిన నారదునితొ శ్రీహరియంతన్
జగముల రక్షకుడగుటకు
మిగులగు తన శక్తియెనని మల్హారికృష్ణా

103. కం. విషయము తెలిసిన శ్రీహరి
మిషతో నొక్కట తెలుపగ గరుడుని బిలిచెన్
విషయము తెలుపక హనుమని
మిషములలొ తెమ్మని బంపెను మల్హారికృష్ణా

104. కం. హిమనగమున గనె గరుడుడు
రామునిజపియించునట్టి కపిపుంగవునిన్
భీమన వెళ్ళిన గరుడుడు
తమకమువికలమై వచ్చెను మల్హారి కృష్ణా

105. కం. హరియెదుట శిరమువాల్చియు
గరుడుడు క్షమియింప వేడెనశ్రులు గారన్
తిరిగిటు హరితెలుపగజెనె
శ్రీరాముని పిలుపు దెల్ప మల్హారికృష్ణా

106. కం. హరినుడివిన విధముగఖగ
గరుడుడు గర్వము వీడియు వేగమెజనియెన్
సిరిపతి రాముడు పిలిచెని
మారుతికిని తెలిపె ఖగుడు మల్హారికృష్ణా

107. కం. జానకి రాముడు పిలిచని
వినినంతనె హనుమంతుడు దిగ్గునలేచెన్
ఘనవేగముతో జనెరా
మునిజపమును జేయుచు కపి మల్లారికృష్ణా

## సత్యభామ గర్వభంగము

108. క.వృ. కృష్ణుడు సత్యతోవడిగా
దర్శన మొసగుటకు గాను
సీతయు రాములలాగా
వానరుడ దెవచ్చు ననగ మల్లారికృష్ణా

109. క.వృ. సత్యయు గర్వముతోనసె
దీనికి భయపడనేలనె
సీతగ తానగుదున్ననె
రాముగ మీరగుడనె మల్లారికృష్ణా

110. ఉ. వచ్చిన వేగమారుతియు బల్కె న్యాయమె వ్రతం బహో
ఎచ్చటికేగెనయ్య తమ దీక్షయు మాతయు సీత వీడియున్
విచ్చల వీడి వేరొక సతిన్ గొని మాతగ జేయనోర్వనన్
పిచ్చిగ మాటలాడకనె సత్యయుమారుతి కోతివానిగన్

111. చం. అదివినిమారు తాత్మజుడు కోపితుడై లెస సత్యభామతో
ముదితపు నీకునున్ పతిత పావని సీతకు పోలికున్నదే
మెదలక రాముచెంతనను పైదొలగన్ నిను వేడెదయటుల్
కదలకయున్ననే కలచి పైచెద యెల్లటమిద్దె మేడలన్

112. శా. కోపొద్రేకములన్ నణంచుకొని సత్యమ్రొక్కెడిన్ కృష్ణునిన్
జూపంగన్దగు నేత లిన్ హనుమనున్ స్తోత్రంబుజేయన్
నోపంగన్ దగ మాధవుండు పడి తెల్పన్ రుక్మిణి దేవికిన్
రూపాలంకృత రుక్మిణిన్ నిలపగా శ్రీరాముకున్ పత్నిగా

113. కం. జానకి రాముల గనియా
వానర వీరుడు హనుమడు భక్తితొ గొలిచెన్
వినుమా సత్యయు నోడను
నినుదెమ్మని ఖగునిబంపితి మల్లారికృష్ణా

114. కం. నాపాటికి నీ నామము
జపియించుచు నుండినట్టి నన్నిట బిలిచీ
ద్వాపరమంచును నన్నిటు
నీ పాటికి పొమ్మనన్యాయమె మల్లారికృష్ణా

115. కం. భక్తా గ్రేసరహనుమా
శక్తిపతంసుడ నిప్పిటు పలుకన్ దగునే
ముక్తిని నొసగగ వెలసెద
యుక్తిని కోదండ్రాముగ మల్లారి కృష్ణా

## కుచేలోపాఖ్యానము

116. కం. లేమి తొమిత్ర కుచేలుడు
భామిని పంపగా కృష్ణుని చూడగ రాగన్
ప్రేమతో యటుకులు చేకొని
కామితమెల్లను తీర్చిన మల్లారి కృష్ణా

## మంగళాశాసనము

117. కం. మంగళము కోసలేంద్రుకు
మంగళము భల్లు పరివార దేవతకెల్లన్
మంగళము సుందర రుక్మిణికి
మంగళము సత్య బాంబవతి మల్లహరికినెపుడూ

త్రికరణ్మయి సంస్థ షుమారు రెండు దశాబ్దముల నుంచి సారస్వత, ఆధ్యాత్మిక ధర్మ కార్యక్రమములు నిర్వహిస్తూ వస్తున్న సంస్థ. మనసా, వాచా, కర్మణ కేవలం ఆధ్యాత్మిక సిద్ధాంతములు. శ్రీహరికోట నెల్లూరు జిల్లాలో ప్రాణం పోసుకొని యీ సంస్థ కొన్ని వేద ప్రమాణ, ఆధ్యాత్మిక గ్రంథముల ప్రచురణ, కవులను, గాయకులను, నటులను సన్మానించుట, కొన్ని పురాతన దేవాలయముల జీర్ణోద్ధరణ, మొదలగు కార్యక్రమములను నిర్వహించినది. ప్రస్తుతం భగవత్ ప్రేరణతో రచింపబడిన **శ్రీ మల్లహరి కృష్ణ శతకము** వెలుగులోనికి తెచ్చుచున్నది.

త్రికరణ్మయి లోగడ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్య సహాయముతో ప్రచురించిన యితర గ్రంథములు

"శ్రీ రుద్రాభిషేక మాహాత్మ్యము"

"విరాట పర్వము"

"శ్రీసూర్య నమస్కార ప్రభావము"

"శ్రీ అన్నమాచార్య కీర్తనలు".

"శ్రీ కువలాశ్వ విజయము"

ధర్మకార్యముల యందు జిజ్ఞాసగల వారందరూ యీ సంస్థలో సభ్యులు కావలసినదిగా ప్రార్థించుచున్నాము.